నెహ్రూ బాల పుస్తకాలయం-47

# ప్రేమ్‌చంద్

రచన :

**అమృతరాయ్**

అనువాదం :

**ఎ. లక్ష్మీరమణ**

చిత్రాలు :

**సిద్ధార్థ బెనర్జీ**



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా, కొత్త ఢిల్లీ

# 1

ప్రేమ్‌చంద్‌ని చూడాలని కేరళనుంచి బనారసు బయలుదేరి వచ్చాడు చిన్నారి చంద్రహాసన్. తిరిగి తిరిగి చివరకు రచయిత ఇల్లు చేరుకున్నాడు. తన రాక తెలియ చేయటానికి చప్పుడుచేసి చూశాడు. కానీ ఎవ్వరూ పలకలేదు. తలుపు దగ్గరకు వెళ్ళి బెదురుతూనే తొంగి చూశాడు. బుంగ మీసాల అతను ఒక బల్లముందు నేలమీద కూర్చుని ఏదో వ్రాసుకుంటున్నాడు. ఆ గది అంతా చూస్తే ఖాళీగా కనిపించింది. ఆ వ్యక్తి కూడా అతి సామాన్యంగా అగుపించాడు. అతను ఆ ప్రముఖ రచయిత గుమస్తా అయి వుంటాడన్న నమ్మకం ఆ చిన్నవాడికి కలిగింది.

ఒక అడుగు ముందుకు వేసి "నేను మున్షీప్రేమ్‌చంద్‌ని చూడటానికి వచ్చాను." అన్నాడు. ప్రేమ్‌చంద్ తల ఎత్తి చూసి, కలం క్రింద పెట్టాడు. తల పంకిస్తూ, పక్కున నవ్వి, "అది సరేగాని, ముందు నీవు కూర్చోవూ?" అన్నారు.

ఇది ఒకనాటి మాట-నషాద్ అనే ఉర్దూ కవి, లక్నోలో ప్రేమ్‌చంద్‌ని చూడటానికి వెళ్ళాడు. అతని ఇల్లు ఎక్కడ వుందో సుమారుగా తెలిసినా, ఫలానాచోట వుందని బాగా గుర్తు తెలియదు. దారిలో నలిగిన దుస్తుల్లో మొలపంచకు నలిగిన ధోవతి, బనీనుతో ఒక ఆసామి కనిపిస్తే "దయచేసి నాకు మున్షీ ప్రేమ్‌చంద్ ఇంటికి దారి చూపిస్తావా?" అని అడిగాడు.

"తప్పకుండా," అన్నాడాయన.

ఆయన ముందు నడుస్తుంటే, యువ కవి వెనకనే వెళ్ళాడు. త్వరలోనే ఇల్లు చేరుకున్నారు. మెట్లెక్కి వారిద్దరూ మొదటి అంతస్తులో వున్న ఒక ఖాళీ గదిలో ప్రవేసించారు. నిషాద్‌ని కొద్దిసేపు ఆగమని ఆయన లోపలికి వెళ్ళారు. ధోవతిపైన ఒక అంగీ వేసుకుని వెంటనే బయటకు వచ్చారు.

"మీరిప్పుడు మున్షీ ప్రేమ్‌చంద్‌ని కలుసుకుంటున్నారు." కొంటెగా నవ్వుతూ అన్నారు.

అది ఏప్రిల్ 1934 సం॥ ఢిల్లీలో హిందీ మహాసభలు జరుగుతున్న సమయం. ప్రేమ్‌చంద్ నవలా విభాగానికి అధ్యక్షుడుగా ఆహ్వానించబడ్డారు. అప్పటికే ఆయన ప్రఖ్యాత రచయితగా పేరు పొందినా, తనకు ప్రత్యేకమైన సదుపాయాలు కావాలని సంస్థ వారిని కోరలేదు. నవలాకారుడు జైనేంద్ర కుమార్ ఈ విషయాన్ని వివరిస్తూ అన్నాడు, "ఆయన నలుగురితో బాటు హాలులో పడుకున్నాడు. మామూలు రోగులువుండే ఆసుపత్రి వార్డులా వుందది. అయినా ప్రేమ్‌చంద్ పట్టించుకోలేదు. ఆయనకదే బాగుంది. భోజన సమయంలో భోజనశాలకు వెళ్ళి అడిగితే, అక్కడున్న వాలెంటీరు అబ్బాయి, టిక్కెట్టు చూపించమని అడిగాడు.

"టిక్కెట్టా? అది ఎక్కడ లభిస్తుంది?"

"కొనదలుచుకుంటే, అదిగో ఆ కనిపించే కిటికీ దగ్గర కొనవచ్చు. లేదా, ఆఫీసులో లభిస్తుంది." అతను ఎవరితో మాట్లాడుతున్నాడో తెలియక అన్నాడా వాలెంటీరు అబ్బాయి.

ప్రేమ్‌చంద్ మాట్లాడకుండా క్యూలో నిలబడి, కిటికీ దగ్గరకు వెళ్ళి టిక్కెట్టు కొనుక్కున్నారు.

ఆ విధంగా నిరాడంబరంగా వుండటమే ఆయన నైజం.

ఇది మరింకొక సన్నివేశం.1 1935 సం॥ లాహోరులో ఉర్దూ నాటక రచయిత, ఇంతియాజీ అలీటాజ్, ప్రేమ్‌చంద్‌ని తేనేటి విందుకు ఆహ్వానించాడు. "నా పనులు కొన్ని చూసుకొని వస్తా"నని మాట ఇచ్చారు ప్రేమ్‌చంద్. పనుల ఒత్తిడిలో లాహోరు బజారులన్నీ తిరిగి తిరిగి, సాయంత్రానికి నలిగిన ధోవతి, ముతక జుబ్బాతో కవిగారి ఇల్లు చేరుకున్నారు. అక్కడ ఒకదానికి మించినది ఇంకొక కారు-పందలాదికారులు బారులుతీరి వున్నవి. న్యాయమూర్తులు, న్యాయవాదులు, వైద్యులు, ఆచార్యులు, పట్టణ ప్రముఖులంతా అక్కడచేరి వున్నారు. ప్రేమ్‌చంద్‌ని అంతకు పూర్వం చూడనివారు, పల్లెటూరు పేదవానిలా చిందరవందర దుస్తుల్లో తయారైన ఆ విచిత్ర వ్యక్తిని చూసేసరికి విస్తుపోయారు. ఇందరు పురప్రముఖులు చూడవచ్చిన వ్యక్తి ఇతనా అని ఆశ్చర్యచకితులైనారు. ఆ ఆశ్చర్యంనుంచి కోలుకునే సరికి కొద్దికాలం పట్టింది.

ప్రేమ్‌చంద్‌ని గురించి ఇటువంటి కథ లింకెన్నో వున్నాయి. ఇవన్నీ పరిశీలిస్తే తెలిసేది ఒకటే-అతడు ఎంత నిరాడంబరజీవి అన్నది. ఆయనకి పైపై ఆడంబరాలు లేవు. దేనినైనా ఆయన ద్వేషిస్తాడూ అంటే, అది మాయా వేషం.

''నా జీవితం ఒక మైదానం వంటిది. అక్కడ పల్లాలు వున్నా, శిఖరాలు, పర్వతాలు, అరణ్యాలు, లోతైన కనుమలు, శిథిలాలు మాత్రం లేవు. పర్వతారోహణ అంటే ఆసక్తి చూపేవారు ఇక్కడ నిరాశ చెందుతారు.

''నేను జూలై 3 తా, 1880 సం॥ కాశీకి నాలుగు మైళ్ళ దూరంలో వున్న లామాహి అన్న పల్లెలో జన్మించాను. మా తండ్రి తపాలా ఆఫీసులో పని చేసేవారు. అమ్మ అనారోగ్యంగా వుండేది. నాకు ఒక అక్కయ్య కూడా వుండేది. నేను పుట్టినప్పుడు నా తండ్రి నెలకు ఇరవై రూపాయలు గడించేవారు; చనిపోయేసరికి ఆయన జీతం నలభై రూపాయలు. ఆయన జీవితంలో ఎంతో మెలకువగా నడచుకునేవారు. కానీ అవసాన దశలో దెబ్బతిన్నారు, దాదాపు జారిపడ్డారనే చెప్పవచ్చు. తనతో నన్నూ దిగజార్చారు. నాకు పదిహేను సంవత్సరాలు రాగానే పెండ్లి చేసేసారు. పెండ్లి అయిన సంవత్సరం తిరక్కుండానే గతించారు.''

ప్రేమ్‌చంద్ వర్ణన కొంత విడ్డూరంగానే తోస్తుంది. (అది బహుశా ఆయనకి కష్టకాలమే కావచ్చును. కానీ



అదీ విడ్డూరం అనవచ్చునో లేదో నేను చెప్పలేను.) బాల్య దశలో ఏదీ విడ్డూరం కాదేమో। ఒక చిత్రమైన ఇంద్రజాలం అన్నింటినీ మార్చేస్తుంది-బాల్యం ఇంద్రజాలాన్ని అర్థం చేసుకుంటుంది. బాల్యంతోబాటు ఇంద్రజాలం కూడా మాయమైపోతుంది. ప్రేమ్ చంద్‌ని. ఒక్క బాధ మాత్రం ఏ మంత్రశక్తి మరిపించలేకపోయింది: అది ఆయన ఎనిమిదవ యేటనే తల్లి మరణం. అది ఆయన మనస్సులో ఒక లోతైన గాయం ఏర్పరచింది. ఆ గాయం జీవితాంతం మానని పుండులా మిగిలింది. ప్రేమ్‌చంద్‌ని తండ్రి తిరిగి వివాహం చేసుకొని తనకొక మారు తల్లిని తెచ్చిపెట్టినా, ఆయన ఆనందం ఎక్కువ కావటం కాని, విచారం తక్కువ కావటంగాని జరగలేదు. కానీ ఏ పిల్లవాడు తన విచారాలను నెమరువేస్తూ కూర్చుంటాడు? అదే విధంగా నవాబ్ రాయ్ ధన్‌పాల్ కూడా

లమహి గ్రామం—ఆయన జన్మస్థలం



మరిచిపోయారు. ప్రేమ్‌చంద్‌ని ఆ రోజుల్లో అలా పిలిచేవారు. ప్రేమ్‌చంద్ అన్న పేరు చాలాకాలం తరువాత ఆయన పెట్టుకున్నది.

అతడి తల్లి చనిపోయిన సమయంలోనే ప్రేమ్‌చంద్‌ని చదువు కొరకు, ప్రక్కనున్న పల్లెటూరు పంపించారు. ఆ రోజుల్లో కాయస్త కులం పిల్లలకు ఫారసీ, ఉర్దూ భాషలలో చదువు చెప్పించటం పరిపాటిగా వుండేది. బడికివెళ్ళి చదువుకోవటం అన్నది సరదాగానే వుండేది. అక్కడి ఉపాధ్యాయుడు వృత్తి రీత్యా దర్జీ, కానీ కొందరు పిల్లలకు చదువు చెబుతూ బడిపంతులైనాడు. పిల్లలు బడి జీతం కట్టినంతవరకు, తనకు ఇంట్లో చిల్లర పనుల్లో సాయపడినంత వరకు, బడిపంతులు, బడికి ఎవరు వచ్చిందీ, ఎవరు రానిదీ పట్టించుకునేవాడు కాదు. హాజరు పుస్తకమంటూ లేనేలేదు. అందువల్ల నవాబు ఏదో ఒక సాకుతో స్కూలు మానేసి, ఇతర వినోదాలు వెతుక్కుంటూ ఏ విధంగా వెళ్ళేవాడో తన జీవిత కథ 'దొంగతనం' అన్న దానిలో తరువాత వివరించారు.

"కొన్నిసార్లు మేము పోలీసు స్టేషన్ దగ్గర నిలబడి పోలీసులు కవాతు చేయటం చూసేవాళ్ళం, మరి కొన్నిసార్లు కోతులు లేక ఎలుగుబంటుల నృత్యం చూడటానికి వాళ్ళ వెంటబడి వెళ్ళేవాళ్ళం. రైలు స్టేషన్‌కి వెళ్ళి రైళ్ళ రాకపోకలు గమనిస్తూ వుండేవాళ్ళం. మాకు బహుశా బడివేళల కన్నా, రైళ్ళు వచ్చివెళ్ళే వేళలే బాగా తెలిసేవి.

మామూలుగా పల్లెపట్టున ఆడే ఆటలు పిళ్ళంగోరి ఆట కబడ్డీ ఆడుకునేవారు. ఈ పిళ్ళంగోరి ఆటలో నవాబ్‌ది అరితేరిన చేయి. చెరువుకు వెళ్ళి చేపలుపట్టి, కాల్చుకు తినటం, చెరుకు పంట కాలంలో చెరుకు గడలు పొలం నుండి కొట్టుకు రావటం, మామిడి పిందెలను రాళ్ళతో కొట్టటం (గురిచూసి కొట్టటంలో నవాబ్‌ది పైచేయి) వంటి వినోదాలు దమ్మిడి ఖర్చులేని సరదాలు. దొంగతనాలు చేస్తున్నచోట, వాళ్ళ పట్టుకు తిట్టినా, అదికూడా ఆటలో ఒక భాగంలా సరదాగానే వుండేది. నవాబ్‌కి ఇంట్లోకన్నా బయట కాలం గడపటం పెద్ద ఊరటగా వుండేది. తండ్రికి తపాలా ఆఫీసు పనుల వత్తిడి, మారుటి తల్లి రుసరుసలు, వీటితో ఇల్లు ఏమంత ఆకర్షణీయమైనదిగా వుండేదికాదు. ఎప్పుడు తండ్రికి బాందా, బాస్తీ, ఆజాంగర్, గోరక్‌పూర్, కాన్పూర్, లక్నోల్లాంటి ప్రదేశాలకు

బదిలీ అవుతుందా అని కాచుకొని వుండేవాడు. ప్రయాణమంటే నవాబ్‌కి స్వర్గం. అందు వల్ల అంతులేని సంబరంగా వుండేవి. క్రొత్త ప్రదేశాలు చూడటం సరదా మాత్రమే కాకుండా, తండ్రి కూడా ఇంటివద్దకన్నా, కొంత గారాబంగానే చూసేవాడు. అదీకాక ప్రక్కన తట్ల దీవెనలిచ్చే మారుటి తల్లి కూడా వుండేది కాదు. ఎక్కువగా ఆమె ఇంటి వద్దనే వుండిపోయేది. నవాబ్ యీ అనుభవాలను మనసులో పదిలపరచుకొని, తరువాత తన కథలలో కూర్చున్నట్లుగా తోస్తుంది. ఉదాహరణకు ఆయన వ్రాసిన మరో ఆత్మకథ అనతగ్గ 'కాజకీ' అన్న రచన (కథలో కాజకి పోస్టు ఆఫీసు బంట్రోతు) ప్రేమ్‌చంద్ తన తండ్రిని గురించి యీ విధంగా వ్రాశారు.

"నాన్న చాలా కష్టపడి పని చెయ్యవలసి వచ్చేది. అందుకే కాబోలు తొందరగా కోపం వచ్చేసేది. నేను పిల్లైనంత వరకు ఆయన కంటికి కనిపించకుండా తప్పుకు తిరిగే వాడిని. ఆయన కూడా నన్నంతగా దగ్గరకు తీసుకునేవారు కాదు. రోజుకు రెండుసార్లు ఇంటికి వచ్చేవారు. వచ్చినప్పుడు భోజనంచేసి ఒక్క గంట మాత్రం వుండి వెళ్ళేవారు. మిగిలిన సమయం ఆఫీసులో ఏదో వ్రాసుకుంటూనే గడిపేవారు. తన చేతి క్రింద పని చెయ్యటానికి ఒక కుర్రవాడిని నియమించమని ఎన్నిసార్లు పై అధికారులను అడిగినా, ఏమీ ప్రయోజనం లేకపోయింది."

తరువాత తరువాత, తండ్రికీ కొడుకుకీ మధ్య అంతగా సంబంధ బాంధవ్యాలు లేవు. తల్లి చనిపోయిన తరువాత, తల్లిలా చల్లగా చూసింది అక్కయ్యే. అయినా ఆమె కూడా పెండ్లికాగానే వెళ్ళిపోయింది. అందువల్ల చిన్నతనంలో ముద్దుమురిపా ఎరుగడు. ఒంటరిగా పెరిగాడు. ఆ తరువాత పాత్ర తిరుగుబోతు పాత్ర—పన్నెండేళ్ళకే పొగ త్రాగటంతో ప్రారంభమైంది ఆ పాత్ర. బాల్యాన్ని గురించి ప్రస్తావిస్తూ ప్రేమ్‌చంద్ ఇలా అన్నారు, "పొగ త్రాగడమేమిటి, ఆ లేత్రాయంలో కూడని విద్యలెన్నో నేర్చాను." కానీ అటువంటి దౌర్భాగ్యాల పాలుపడ్డ వారిని ప్రకృతే దారిలో పెడుతుంది. నవాబ్ తన తండ్రితో గోరక్‌పూర్‌లో వున్నప్పుడు, బుద్దీలాల్ అనే ఒక పుస్తకాలు అమ్మే అతనిని కలుసుకోవటం అనుకోకుండా కలిసివచ్చిన సంఘటన.

" నాకప్పుడు పదమూడు సంవత్సరాలుంటాయి. నాకు హిందీరాదు. ఉర్దూ నవలలంటే అమిత ఇష్టం. మౌలానాషరారా, పండిత రత్ననాథ్ సర్‌షార్, విర్జారిష్వా, హర్‌డోయ్‌కి చెందిన మౌల్వి మహమచ్ అలీ, ఆనాటి ప్రసిద్ధ రచయితలు. వీరి పుస్త కాలలో ఏది చేతికి దొరికినా, స్కూలు సంగతే మరిచిపోయి, ముగించే వరకు వదిలేవాడిని కాదు. ఆ రోజుల్లో రేనాల్డు నవలలంటే మహా పిచ్చి. ఉర్దూలో అతని రచనల అనువాదా లెన్నో వచ్చేవి. వచ్చిన వెంటనే అమ్ముడు పోయేవి. ఇవంటే కూడా నాకు మహా పెర్రిగా వుండేది....రత్ననాథ్ సర్‌షార్ రచనలు ఎంత చదివినా తనివి తీరేది కాదు. నేను బుద్దిలాల్ షాపుకు వెళ్ళి పుస్తకాలు తీసుకొని చదివేవాడిని. కానీ పుస్తకాల షాపులో రోజంతా కూర్చుని చదవటం నాకు సాధ్యమయ్యేది కాదు. అందువలన ఇంగ్లీషు పుస్తకాలకు క్లుప్తంగా వచ్చే నోట్సు చూసి వ్రాసి, వాటిని స్కూలు పిల్లలకు అమ్మి, ఆ డబ్బుతో నవలలు ఇంటికి తెచ్చుకునేవాడిని. ఆ రెండు మూడు సంవత్సరాలలో వందలాది నవలలు చదివి వుంటాను. నవలలు చదవటం పూర్తి అయిన తరువాత, హిందీలో అనువదింపబడ్డ నావల్ కిషోర్ ప్రెస్ హిందీ అనువాదాలు, పురాణాలు, టిలిసిం-ఇ-హోషురుబా గ్రంథ సంపుటాలు ఎన్నో చదివాను. ఈ అపరాధ పరిశోధక కథలు అప్పటికి 17 సంపుటాలుగా వెలువడ్డాయి. ప్రతి సంపుటీ రెండువేల పేజీలకు తగ్గకుండా పెద్ద సైజు గ్రంథం. ఈ పది హేడు సంపుటాలుకాక ఈగ్రంథంలో కథలులెఖలేనన్ని పుస్తకాలుగా వెలువడ్డాయి. వీటన్నిం టినికూడా నేను జీర్ణించుకున్నాను. ఈ పుస్తకాలు వ్రాసిన రచయిత అత్యద్భుతమైన కల్పనా శక్తికి ఆశ్చర్యచకితులం కావలసిందే. మౌలానా ఫైజీ ఈ కథలను అక్బర్ పాదుషా కొరకు పారశీక భాషలో వ్రాసినట్లుగా తెలుస్తుంది. దానిలో ఎంత సత్యముందో నాకు తెలియదుగాని ప్రపంచంలో ఏ భాషలోనూ ఇటువంటి అద్భుత కథల పుస్తకం వెలువడి వుండదని నాకనిపిస్తుంది. అది ఒక సంగ్రహ గ్రంథం. అది వ్రాయటం మాట అటుంచి, దానిని చూసి వ్రాయటమన్నది కూడా, ఒక మనిషి అరవై సంవత్సరాల జీవితంలో అలివి కాని పని అనిపిస్తుంది."

"పటుత్వంగల కథలు వ్యక్తం చెయ్యటం ప్రేమ్‌చంద్ సొత్తని అందరికీ తెలిసిన

విషయమే. దాని రహస్యం ఇందులోనే వుంది. పదమూడు, పదిహేను సంవత్సరాల మధ్య ఆయన చదివిన పుస్తకాల అనుభవమే కథకుడుగా వారి అనన్య శక్తిసామర్థ్యాలకు పునాది వేసింది. దీనికితోడు నూతన సృష్టి చేయాలన్న ఆసక్తి జతకూడింది. ఇవే ఆ బాలుణ్ణి ఒంటరితనం, తుంటరితనంలాంటి దౌర్భాగ్యాల నుంచి రక్షించింది, అదుపులో పెట్టింది. ఒంటరితనాన్ని ఒదిలించి, తుంటరితనాన్ని తునాతునకలు చేసింది.

ఆ సమయంలోనే నవాబ్ తన మొదటిరచన వ్రాసినది. దూరపు బంధువు ఒకడు తనని ఎగతాళి పట్టించి ఏడిపించినందువల్ల పుట్టుకొచ్చిన ఉక్కురోషం వెళ్ళబోసుకోవటానికి చేసిన పని అది. అలా అవమానించిన ఆతగాడికి బాగా శాస్తి జరిగినట్లే. ఆతగాడిని ఒక పట్టాన ఒదిలిపెట్టలేదు కుర్రవాడు. కసి అంతా బాగా తీర్చుకున్నాడు. కానీ దురదృష్ట వశాత్తు ఆ నాటిక వెలుగు చూడలేదు. బహుశా సిగ్గుతో చచ్చిపోతున్న ఆ దుష్టుడు, దాన్ని కాస్తా అగ్నిహోత్రుడికి అర్పించి మరీ పలాయనం పట్టించినట్లుంది. ఏమైనా, యీ అనుభవంతో యువరచయితకు తన కలం బలం తెలిసి వచ్చింది.

15 సంవత్సరాలకు పెండ్లి అయ్యేవరకు, అందరి జీవితాలు మాదిరే మామూలు ధోరణిలో సాగిపోయింది. మొట్టమొదట, పెండ్లి అన్నది ఓ వినోదంగా సంబరంగానే అనిపించినా, తిరువాత తరువాత అది ఒక పీడకలగా తయారైంది. పెండ్లి అంత లేత్రాయంలో జరగటమన్నది ఒక్క కారణమే కాకుండా ముఖ్యంగా ఆ జంట మనస్సులు కలవకపోవటం దీనికి కారణం అయివుండవచ్చు. ఆ మరుసటి సంవత్సరమే తండ్రి గతించాడు. ప్రేమ్ చంద్ ఒక వ్యాసంలో యిలా వ్రాసుకున్నారు:

"నేను తొమ్మిదవ తరగతి విద్యార్థిని. ఇంటివద్ద నా భార్య, మారుటి తల్లి, ఆమె ఇద్దరు పిల్లలు వుండేవారు. నాకు చూస్తే ఆదాయం శూన్యం. మాకు మిగిలిన కాస్తో కూస్తో డబ్బు, ఆరునెలలపాటు మాతండ్రి జబ్బుకు, తరువాత దహనక్రియలకు ఖర్చయిపోయింది. నాకు ఎం.ఏ. చదివి న్యాయవాది కావాలని పెద్ద కోరిక. ఆ రోజుల్లో కూడా ఉద్యోగాలు దొరకడమన్నది ఏమంత సామాన్యమైన విషయం కాదు. ప్రయత్నిస్తే పన్నెండు రూ॥ల

జీతం వచ్చే ఉద్యోగం దొరికి వుండవచ్చు. కాని నాకు చదువు మీద దీక్ష పోలేదు. నా కాళ్ళకు చుట్టుకున్న సంకెళ్ళు ఇనుప సంకెళ్ళేకాదు, పంచలోహాలతో చేయబడ్డంత దిట్టంగా వున్నాయి. నాకుమా స్తే పర్వత శిఖరాలందుకోవాలన్నంత ఆశగా వుంది!''

ఆనాటి జీవితాన్ని వర్ణిస్తూ, ''చినిగిన బట్టలు, అరిగిన చెప్పులు విడవని గడ్డు రోజులు అవి'' అంటారు ప్రేమ్‌చంద్ ఒక వ్యాసంలో.

కాశీ, క్వీన్సు కాలేజి, ఉన్నత పాఠశాలలో చదువుకొంటున్నప్పుడు, అక్కడ ప్రథమ ఉపాధ్యాయుడు జీతం చెల్లించకుండానే చదువుకునే అవకాశం నాకు కల్పించాడు. పరీక్షలు దగ్గరపడుతున్నాయి. మూడున్నర గంటలకు స్కూలు విడవగానే అక్కడనే బొంగులగేటు అనబడే ఒకచోట ఒక పిల్లవాడికి చదువు నేర్పించేవాడిని. నాలుగు గంటలకు అక్కడ చేరుకొని, ఆరుగంటల వరకు ఆ అబ్బాయికి చదువు చెప్పేవాడిని. ఆ తరువాత అయిదు మైళ్ళ దూరంలోవున్న మా పల్లెకు బయలుదేరేవాడిని. ఎంత వేగంగా నడిచినా, ఎనిమిది గంటల లోపుగా ఇల్లు చేరలేక పోయేవాడిని. ప్రతి ఉదయం, ఎనిమిది గంటలకు ఇల్లు కదలకపోతే, స్కూలుకు సమయానికి చేరుకోలేను. రాత్రి భోజనం తరువాత లాంతరు ముందు కూర్చుని చదువుకొంటూ ఎప్పుడో నిద్రలోకి జారిపోయేవాడిని. అయినా నా పట్టు ఒదలలేదు.''

తండ్రి పోయిన తరువాత మరీ గడ్డురోజులు వచ్చిపడ్డాయి. ఇంటి దగ్గర ఒత్తిళ్ళ వల్ల ఆ సంవత్సరం పరీక్షకి కూడా కూర్చోలేక పోయారు. ఆ మరుసటి సంవత్సరం 1898లో పరీక్షకు కూర్చుని సామాన్యమైన మార్కులతో రెండవ తరగతిలో ఉత్తీర్ణు లయ్యారు. ఇంక క్వీన్సు కాలేజిలో ప్రవేశం దొరికే అవకాశం కాస్తా జారిపోయింది. ప్రథమ తరగతి లభించిన వారికి మాత్రమే ఆ కాలేజీలో జీతం కట్టకుండా చదివే అవకాశం వుంది. ఆ సంవత్సరమే హిందూ కళాశాల స్థాపించబడటంవల్ల, ప్రేమ్‌చంద్ ఆ కాలేజీలో చేరదలచుకున్నారు. అయితే, అక్కడ కూడా నిరాశే ఎదురైంది. లెక్కలు ప్రేమ్‌చంద్‌కి గడ్డు సమస్య. ప్రవేశ పరీక్షలో లెక్కల్లో ఉత్తీర్ణుడు కాలేకపోయారు. ''లెక్కలు అంటే

నాకు ఎవరెస్టు శిఖరం వంటిది. దానిని నేను ఎన్నడూ చేరుకోలేను'' అని వ్రాసుకున్నారు. హిందూ కాలేజీలో ప్రవేశించటానికే కాదు. కొన్ని సంవత్సరాలపాటు ఇంటర్ మీడియట్ పరీక్షలో ఉత్తీర్ణుడు కావటానికికూడా అది అడ్డుగోడై పోయింది. రెండుసార్లు ప్రయివేటుగా పరీక్షకు కూర్చుని తప్పి నిస్పృహ చెందారు. చివరకు కొత్తనిబంధనల ప్రకారం లెక్కలు తప్పించుకోగలిగి దాని బదులు మరో పాఠ్యగ్రంథం తీసుకొని చదివి, 1916 సం॥ మెట్రిక్యులేషన్ పూర్తి చేసిన తరువాత పద్దెనిమిది సంవత్సరాలకు పూర్తిచేయగలిగారు.

మన వెనుకటి కథకు తిరిగివద్దాం. ప్రేమ్‌చంద్ హిందూ కాలేజీలో చేరే అవకాశం లేక ఎంతో నిరుత్సాహంతో ఇల్లు చేరుకున్నారు. చదువుకోవాలన్న ఆశ మనసులో ఇంకా బలంగా పీకుతూనే వుంది.

''ఇంటి దగ్గర కూర్చుని ఏం చెయ్యటం? లెక్కలు ఎలా నేర్చుకోవటం, తిరిగి కాలేజీలో ఎలా ప్రవేసించటం అన్నది పెద్ద సమస్యగా తయారైంది. చదువుకోవాలంటే పట్టణంలో వుండాలి. అదృష్టవశాత్తు ఒక న్యాయవాది కొడుకుకి చదువుచెప్పే అవకాశం దొరికింది. నెలకు అయిదు రూపాయల జీతం. నేను రెండు రూపాయలతో సరిపెట్టుకుని మిగిలిన మూడు రూపాయలు నా కుటుంబానికి ఇవ్వదలిచాను. ఆ న్యాయవాది, పశువుల శాలపైన ఒక కొట్టంలో నేను వుండటానికి అంగీకరించారు. బజారునుంచి ఒక లాంతరు కొనితెచ్చుకొని, పట్టణంలో నా జీవితం ప్రారంభించాను. ఇంటి దగ్గర నుంచి, కొన్ని కుండలు కూడా తెచ్చుకున్నాను. రోజుకొకసారి వంట చేసుకొని, తినేవాడిని. కుండలు కడిగిన తరువాత పుస్తక భండాగారానికి బయలుదేరేవాడిని. లెక్కలు నేర్చుకునే చంకతప్ప. అక్కడ నేను చదివేవి ఎక్కువ భాగం నవలలే. ఆసమయంలోనే, పండిత రత్ననాథ్ ధర్ వ్రాసిన ఫసానా-ఇ-అజాద్ (అజాద్ ప్రణయం), చంద్రకాంతుని సంతతి, బంకించటర్జీ రచనలు ఉర్దూ అనువాదాలలో ఎన్ని లభిస్తే అన్ని చదివాను.'' అయితే బీదరికం మాత్రం ఆయన్ని ఒదిలిపెట్టకుండా అంటిపెట్టుకునే వుండిపోయింది.

''ఆ శీతాకాలం నా దగ్గర చిల్లిగవ్వలేదు. కొన్ని రోజులపాటు రోజుకొక పైస ఖరీదుచేసే, చవుక రకం భోజనంతింటూ గడిపాను. అప్పు అడగాలంటే బిడియంగా వుండేది, ఒకవేళ నోరు తెరిచి అడిగినా, అప్పు పుట్టటం కూడా కష్టమే అయింది. ఒక

సాయంత్రం. ఒక పుస్తకం అమ్మటానికి వెళ్ళాను—అది నేను రెండు సంవత్సరాల వెనుక కొన్న చక్రవర్తి లెక్కల పుస్తకానికి వివరణ పుస్తకం. ఇప్పటి వరకూ ఎంతో కష్టంమ్మీద ఆ పుస్తకాన్ని కాపాడుకోగలిగాను. కానీ యీ రోజు తప్పవిసరిగా ఆ పుస్తకాన్ని అమ్మవలసి వచ్చింది. నేను దాన్ని రెండు రూపాయలకు కొన్నా. ఒక్క రూపాయకు అమ్మాను. ఆ రూపాయి పట్టుకొని ఇంటికి వెళుతుండగా అక్కడ కూర్చున్న పెద్ద మీసాల పెద్దమనిషి "నీవు ఎక్కడ చదువుకుంటున్నావబ్బాయి?" అని అడిగాడు.

"నేను ఎక్కడా చదువుకోవటం లేదు. ఎక్కడయినా చేరాలని వుంది" అన్నాను.

"నీవు మెట్రిక్యులేషన్ పరీక్ష పాసయినావా? నీకు ఉద్యోగం కావాలా?"

"కావాలిగాని, దొరకలేదు."

ఆ పెద్దమనిషి ఒక చిన్న పాఠశాలకు ప్రధానోపాధ్యాయుడు. ఆ స్కూలులో ఒక ఉపాధ్యాయుడు కావలసి వుంది. అతను నాకు నెలకు పద్దెనిమిది రూపాయల జీతం ఇస్తానన్నాడు. నేను ఒప్పుకున్నాను. ఆ పరిస్థితుల్లో పద్దెనిమిది రూపాయలు నా ఊహకు మించిన మొత్తం. మరుసటిరోజు తిరిగి అతన్ని కలుసుకుంటానని మాట ఇచ్చి, ఆలోచనల్లో తేలిపోతూ ఇల్లు చేరుకున్నాను. అది 1899 సం॥. లెక్కలు నాకు అవరోధంగా నిలవలేదంటే, నేను ముందుకు వెళ్ళే ఆశ కనిపించింది. కానీ వాటి అన్నిటికన్నా పెద్ద అవరోధం, విశ్వవిద్యాలయాలు, సరిగా పరిస్థితులను అవగాహనం చేసుకోకపోవటం అనిపించింది. అప్పుడేకాదు, చాలాకాలంపాటు విశ్వవిద్యాలయాలు, పిడుక్కీ బియ్యానికీ ఒకే మంత్రమన్న సూత్రం పాటిస్తూ వచ్చింది."

# 3

చునార్ కాశీకి నలభై మైళ్ల దూరంలో వున్న ప్రశాంతమైన చిన్న స్థలం. అక్కడ పురాతనమైన కోట ఒకటి వుండేది. ఆ రోజుల్లో అక్కడ ఆంగ్లేయ సిపాయిల పటాలం వుండేది. ప్రేమ్‌చంద్ వెంటనే వెళ్ళి పనిలో చేరాడు. ఆ కష్టకాలంలో అదే పదివేలనిపించింది. ఆ తరువాత ఇరవై సంవత్సరాలపాటు సాగనున్న అధ్యాపక జీవితం అలా ప్రారంభమైంది.

బడి విడిచిన తరువాత అంతగా పని వుండేది కాదు. రోజులు ఒకే విధంగా దొర్లిపోతున్నట్లుండేవి. కానీ ఆయనకి ఎప్పుడూ తోడుగా పుస్తకాలుండటంవల్ల తోచక పోవటం అంటూ వుండేది కాదు. అక్కడి వారు ఆయన పుస్తకం పురుగు అన్న బిరుదు ఒకటి తగిలించారు. (పుస్తకం) పురుగు కూడా ఒక్కొక్కప్పుడు తిరగబడుతుందంటారు. అది నిజమే అయింది. బడి జట్టుకు, సైనిక జట్టుకు మధ్య ఫుట్‌బాల్ ఆటల పోటీలు జరుగుతున్న సమయం అది. బడిపిల్లలు సహజంగా వారి జట్టు పిల్లల్ని ఉత్సాహపూరితంగా ప్రోత్సహించారు. దానికితోడు సైనిక జట్టు ఓడిపోవటం జరిగింది. విద్యార్థుల జయ జయ నినాదాలు మిన్నుముట్టాయి. సైనిక జట్టుకు ఇది భరించరాని అవమానంగా తోచింది. సైనిక జట్టులోని ఒక సైనికుడు అక్కసు పట్టలేక, విద్యార్థుల జట్టులోని పిల్లవాడిని కొట్టాడు. ఆటల పోటీలలో ఆవేశపూరితులై వున్నప్పుడు అటువంటి చిల్లికజ్జాలు రావటం పరిపాటే. అందులో విడ్డూరం లేదు. ఎందువల్లనో అది గమనించిన ప్రేమ్‌చంద్ భరించలేక పోయారు. బహుశా ఆయనకి అందులో తెల్లవారి దౌర్జన్యం అగుపించి వుంటుంది. ఆ కొట్టినవాడు, తనతోటి తెల్లవాడిని ఆ విధంగా పట్టుకొని కొట్టివుండేవాడా అన్న ప్రశ్న చటుక్కున తల ఎత్తింది. దగ్గర ఎల్లగురుతులో పాతివున్న కర్రను పూడ బెరికి సైనిక జట్టులోని పిల్లవాడిని పట్టుకు చితకకొట్టేశారు. బడిపిల్లలు కూడా చేయి చేసుకున్నారు. ఆ తెల్లపిల్లకాయలు పరి జీవితాంతం మరిచిపోనంతగా తన్నులు తిన్నారు.

ఆ గల్లంతు సద్దుమణిగిన తరువాత అందరికీ తలచుకుంటే ఆశ్చర్యం కలిగింది.

అంత మెత్తని స్వభావంగల ఆ వ్యక్తి దీనికంతా నాయకత్వం ఎలా వహించారా అని అంతా విస్తుపోయారు. అంతపని చెయ్యగలిగింది ఈ పుస్తకం పురుగేనా అని వారి అబ్బురం. ఆయనలో అంత ఆవేశం దాగివుందని ఎవరు వూహించి వుంటారు? నిజానికి ఆయన అంతటి ఆవేశపూరితుడు కానేకాదు: కొన్ని స్వవిషయాలలో కొంత భయస్తుడు కూడా అనవచ్చును. కానీ దేశ గౌరవానికి సంబంధించిన విషయాలలో, లేదా తాను నమ్మిన న్యాయసమ్మతమైన విషయాలకు వ్యతిరేకంగా జరిగినప్పుడుగాని ఆయన నైజం మారిపోతుంది. ఆయనప్పుడు నిర్భయంగా ముందడుగు వెయ్యటానికి జంకడు.

ఈ నైజానికి కూడా తొందరలోనే పరీక్ష సమయం ఆసన్నమైంది. అది, తన తోటి ఉపాధ్యాయుడు మౌల్వీ ఇబ్నీ అలి, పాఠశాల అధికారుల కోపానికి గురిఅయినప్పుడు.

ప్రేమ్‌చంద్ జీవితం ఒడుదుడుకులుగానే సాగిపోతుంది. పద్దెనిమిది రూపాయల జీతం, తన సొంత ఖర్చులకు, సంసారం ఖర్చులకు చాలిచాలని మొత్తం. వారి ఆర్థిక పరిస్థితి ఏమంత మెరుగ్గా లేదు. కొద్దికాలం క్రితమే ఆయన తన ఉన్నికోటును అమ్ముకో వలసిన అగత్యం పట్టింది. ఈ ఉద్యోగం రావటమన్నది ఒక అదృష్ట రేఖలాంటిదనే చెప్ప వచ్చును. భావి జీవితం చూస్తే, అంతా అయోమయంగానే వుంది. అటువంటి పరిస్థితుల్లో వున్న ఆయన తన హద్దుల్లో వుండవలసిన వాడే. అధికారులు మౌల్వీపట్ల అన్యాయంగా ప్రవర్తించారని నమ్మకం కలగగానే వెనకా ముందూ ఆలోచించుకోకుండా, బహిరంగంగా తన అభిప్రాయాన్ని వెల్లడించారు.

క్వీన్సు కాలేజి ప్రధానోపాధ్యాయుడు, బేకన్ మహాశయుడికి విద్యాశాఖలో పలుకు బడి, గౌరవం వున్నాయి. అదృష్టవశాత్తు ప్రేమ్‌చంద్ అంటే అతనికి అభిమానం వుండటంవల్ల, బహరాయిచ్ ప్రభుత్వ కళాశాలలో అయిదవ ఉపాధ్యాయునిగా ఆయనకి ఉద్యోగం లభించింది.

అప్పటినుంచి 1921 సంవత్సరం వరకు ప్రేమ్‌చంద్, ప్రతాప్‌గఢ్, అలహాబాదు, కాన్పూరు, హమీర్‌పూర్, బస్తీ, గోరక్‌పూర్‌లాంటి అనేక ప్రభుత్వ కళాశాలల్లో పని చేశారు. ప్రతి రెండు మూడు సంవత్సరాలకు అయ్యే యీ బదిలీలు, ఆయన ఆరోగ్యానికి సరిపోలేదు. కానీ, రచనకు మాత్రం తోడ్పడ్డాయనటంలో సందేహంలేదు. జీవితానుభవాలు రచయితకు మూలధనంలాంటివి. ఆయన జీవితాంతం అందులోనుండి అనుభూతులను వాడుకుంటూనే వున్నాడు. ఆ అనుభూతుల సారం ఎప్పుడు ఇంకిపోతుందో రచయితకూడా



ప్రఖ్యాత గాయకి సుబ్బలక్ష్మి - ప్రేమచంద్ రచించిన 'సేవాసదన్' తమిళ చిత్రంలో నటించింది

దానితోబాటు ఎండిపోతారు. ఆ తరువాత రచన చేయలేదు. ప్రేమ్‌చంద్ యీ విషయంలో భాగ్యశాలి. ఆయన చాలా కష్టాలను అనుభవించారు. కాని చిత్రమేమంటే, ఆ కష్టాలే ఆయన రచనకు ముడిసరుకును అందించింది. ఒక చోటునుంచి మరొక చోటుకు యీ విధంగా ఉద్యోగ రీత్యా బదిలీలు కావటం, రచయితగా రూపుదిద్దుకొంటున్న ఆయనకి బాగా కలిసి వచ్చాయి. ఉద్యోగం చెయ్యటంవల్ల తిండికీ బట్టకీ లోటులేదు, అనుభూతులు రచనకు రచయితకు పనికివచ్చాయి.

ఈ అనుభూతులను అండగా చేసుకొని, 1900 సంవత్సరం ప్రాంతంలో ప్రేమ్ చంద్ రచనా వ్యాసంగాలు శ్రద్ధతో చేపట్టారు. వారి ప్రథమ రచనలు అంతగా వెలుగులోకి రాలేదు. ఆ సమయంలో వ్రాసినవాటిలో, అసరార్-ఇ-మాబిద్ (దేవాలయాల విడ్డూరాలు) అన్న అసంపూర్ణమైన నవల 1903 నుంచి 1905 వరకు కాశీ, మారుమూలలో వున్న పత్రికలో సీరియల్‌గా వెలువడింది. ఈ నవల దేవాలయాలలో పురోహితుల అక్రమ చర్యలను వెల్లడి చేసింది. అంతవరకు ఆయన చదువుతున్న ప్రణయగాథల ఛాయలు అందులో కనిపించినా, రచనా విధానంలో ప్రత్యేకత లేకపోలేదు. పాఠకులను సంస్కరించ టానికి ఆయన రచనలు సాగించాడు-నూతన సాహిత్య సృష్టి, మనోభావాల వ్యక్తీకరణ ద్వారా ఏ విధంగా పాఠకులకు నూతన మార్గం చూపుతుందో ఆయన ఆ మార్గం అనుస రించాడు. దాదాపు అదే సమయంలో వ్రాసిన మరో పెద్ద నవల 'హం కుర్మా ఓ హమ్ సావల్.' 1907 సం॥ 'ప్రేమ' అన్న పేరుతో హిందీ అనువాదంగా వెలువడింది. చిన్న తనంలోనే భర్తను కోల్పోయిన స్త్రీ, సనాతనాచారాల ననుసరించి, కోరికలు చంపుకొని జీవితం గడపవలసిన శోచనీయ సంఘటనలు తరుచుగా మనం గమనిస్తూనే వుంటాము. ప్రేమ అన్న నవలలో అటువంటి బాల వితంతువు గాథ చిత్రించబడింది. ఆదర్శవంతుడైన నాయకుడు ఆమెను వివాహమాడుతాడు. ప్రేమ్‌చంద్ యీ సంస్కరణను గురించి, కేవలం పైపై వ్రాతలతో తృప్తిపడలేదు. దీనిపట్ల ఆయనకున్న సానుభూతి త్వరలోనే నిరూపించారు. ఆయన మొదటి వివాహం పూర్తిగా విచ్ఛిన్నం అయిన తరువాత, 1906 సం॥లో శివరాణీదేవి అన్న బాలవితంతువును వివాహమాడారు. ఆమె ఆరుగురు బిడ్డలతల్లి అయింది, అందులో ముగ్గురు ఇంకా జీవించి వున్నారు.

# 4

భారత జాతీయ కాంగ్రెసు ఉద్యమంలో ప్రజలు కూడా ఉమ్మడిగా పాల్గొని పోరాడా లన్న నినాదం లేవదీసింది మొట్టమొదట బాలగంగాధరతిలక్. భారతదేశ పాలనా విషయంలో భారతీయులకు కూడా స్థానం వుండాలని బ్రిటిష్ వారితో కొందరు రాజకీయ పెద్దలు రాయ బారం జరిపారు. ఈ రాజకీయ సంప్రదింపులు, ఇదివరలో ఏ కొద్దిమంది రాజకీయ ప్రతి నిధులతో మాత్రమే జరిగేవి. కానీ, 1908 సంవత్సరంలోనే తిలక్‌ని బ్రిటిష్‌వారు మండలే జైలులో పెట్టారు. తిలక్ ప్రారంభించిన ఉద్యమం, ప్రేమ్‌చంద్‌ని బాగా ఆకర్షించింది. అదీకాక కర్జన్‌దొర తలపెట్టిన అఘాయిత్యం కారణంగా బెంగాలులో చెలరేగిన స్వదేశీ ఉద్యమం, ప్రేమ్‌చంద్‌ని స్వాతంత్ర్య పోరాటంవైపు మళ్ళించింది. స్వాతంత్ర్య ఉద్యమం ఎన్నో విభాగాలుగా రూపొంది, దేశం నలుమూలలా వ్యాపించి బ్రిటిష్ వారిపైన కత్తి గట్టింది. ఇందులోనుంచి కొన్ని రహస్య సంస్థలు కూడా పుద్భవించాయి. అందులోని సభ్యులు కొందరు ప్రాణాలనే తెగించి, తమ ధ్యేయం నెరవేరాలని బద్ధకంకణం కట్టుకొని కార్యరంగంలోకి దిగటంవల్ల, వారిలోని ఆవేశం పొంగి ప్రజలను ఉత్తేజపరచింది. ఆ భావాలు యువకుడైన ప్రేమ్‌చంద్‌ని కూడా ప్రభావితం చేశాయి. ఆ ప్రేరణతో ఆయన ఎన్నో రచనలు చేసాడు. గరీబాల్డ్, మజీని వంటి ఇటలీదేశ వీరుల చరిత్రలు, భారతదేశ సంస్కృతీ సాంప్రదాయ వైభవాలను పాశ్చాత్యులకు తెలియజెప్పి వారి కనులు తెరిపించ గలిగిన వివేకానందుని జీవిత చరిత్ర రచించాడు. వివేకానందుడు సామాన్యమైన స్వామి కాదు. తిరుగుబాటును సృష్టించి, నూతన మార్గం అవలంబించిన మహానుభావుడు. ఆ నాటికీ, ఈ నాటికీ అతడి సందేశం ప్రజలలో నూతనోత్సాహం కలిగించింది. ప్రేమ్‌చంద్ వ్రాసిన జీవిత చరిత్రలో ఈ విధంగా వుంది:

"నవయువకులారా, మిత్రులారా, ఉత్తేజంతో నిలవండి. నేను మీకిచ్చే సలహా ఇదే. గీతాపారాయణం చెయ్యటంకన్నా, ఫుట్‌బాలు ఆడి మీరు స్వాతంత్ర్యం సంపాదించ గలరు. మీ రక్తనాళాలు పుష్టిగా వుంటేనే మీరు గీతాబోధను గ్రహించుకొని అనుసరించ

గలరు. గీత ఎవరికి బోధించబడింది? పిరికివాళ్ళకు కాదు సుమా. ధైర్యసాహసాలుగల అర్జునుడికి!"

ఈసమయంలో ప్రేమ్‌చంద్ దేశాభిమానం తొణికిసలాడే కథానికలెన్నో వ్రాశారు. అందులో మొదటి కథానిక 'అమూల్యాభరణం'. ఆ రోజులలో విరివిగా వెలువడిన ప్రణయ ధోరణి కథా విధానంలో అగుపించినా, కొసమెరుపులో కొత్తదనం, కొత్త వినోదం గోచరించాయి. స్వాతంత్ర్య పోరాటంలో చిందించిన రక్తపు బొట్టు ప్రపంచంలో అన్నిటికన్నా అమూల్యాభరణం, అని వ్రాశారు. ఇటువంటి చిన్నకథలన్నీ చేర్చి 'సాజ్-ఇ-వాటర్' (భూమి తల్లి శోకం) అన్న పేరుతో కథల సంపుటిగా ప్రచురించారు. 1909 సం॥లో ప్రచురితమయిన ఆ పుస్తకం త్వరలోనే అధికారుల దృష్టిలో పడింది. ఆ పుస్తకం నవాబ్‌రాయ్ అన్న మారు పేరుతో ప్రచురించబడ్డా, అది ఎవరు వ్రాశారో తెలుసుకోవటానికి అధికారులకు ఎంతో కాలం పట్టలేదు. అప్పుడు పరిస్థితి విషమంగా తయారయింది.

"ఆసమయంలో నేను విద్యా విభాగంలో డిప్యూటీ ఇనస్పెక్టరుగా పనిచేస్తున్నాను. నా కథానికలు ప్రచురించిన ఆరునెలల తరువాత, ఒక సాయంత్రం నేను నా గుడారంలో కూర్చుని వుండగా అక్కడ తనిఖీకి వచ్చిన జిల్లా కలెక్టరు వద్దనుంచి వెంటనే వచ్చి కలుసుకొమ్మని ఆజ్ఞాపత్రం అందింది. ఎద్దుబండి కట్టుకొని, రాత్రంతా ప్రయాణంచేసి, ముప్పై, నలభై మైళ్ళ దూరంలో వున్న ఆ స్థలానికి మరునాడే చేరుకున్నాను. అతనిముందు నా పుస్తకం ఒకటి పడివుంది. నా గుండె వేగంగా కొట్టుకోసాగింది. ఆ పుస్తకం వ్రాసిన రచయిత కొరకు వెతుకుతున్నారని నాకంతకుముందే తెలియవచ్చింది. నేనెవరో తెలుసుకునే నన్ను పిలువనంపారని అర్థమైంది.

"ఈ పుస్తకం నీవు వ్రాశావా?" కలెక్టరు అడిగాడు.

నేనే వ్రాశానని చెప్పాను.

నేను వ్రాసిన ప్రతి కథా వస్తువును గురించిన వివరాలూ అడిగాడు. చివరకు కోపం పట్టలేక అన్నాడు, "నీవు ద్రోహంతలపెట్టి వ్రాసినవి ఇవన్నీ. బ్రిటిష్ పరిపాలనలో వున్నావు కాబట్టి బ్రతికిపోయావు. అదే మొగలాయి ప్రభుత్వం అయివుంటే, నీ చేతులు రెండూ ఖండించబడేవి!"

నేను నా పుస్తకాలన్నీ ప్రభుత్వం వారికి వప్పగించాలని, ఆ తరువాత కలెక్టరు

تاریخ پیدائش سمبت ۱۹۳۷ ۔ باپ کا نام منشی عجائب لال ۔ سکونت ۔

موضع مڑھوا لمہی متصل پانڈے پور ۔ بنارس ۔ ابتدا آٹھ سال تک فارسی پڑھی ۔

پھر انگریزی شروع کیا ۔ بنارس کے کالجیٹ اسکول سے انٹرنس پاس کیا ۔ والد کا

انتقال پندرہ سال کی عمر میں ہو گیا ۔ والدہ ساتویں سال گزر چکی تھیں ۔

پھر تعلیم کے محکمہ میں ملازمت کی ۔ ۱۹۰۱ سے لٹریری زندگی شروع کی ۔ [illegible]

میں لکھتا رہا ۔ کئی سال تک متفرق مضامین لکھے ۔ ۱۹۰۴ میں ایک ہندی ناول

پریما لکھا [illegible] میں شائع کرایا ۔ ۱۹۱۲ میں [illegible] ۔

ہندی میں سیوا سدن ۔ پریم آشرم ۔ رنگ بھومی ۔ کایا کلپ ۔ نرملا

ఆయన ఉర్దూ రచన యొక్క ఒక నమూనా

అనుమతి లేకుండా ఏ రచనా చెయ్యకూడదని తీర్పు చెప్పారు. తేలికగానే బయటపడ్డా ననుకున్నాను.

మొదటి షరతు ఓ విధంగా ఒప్పుకున్నట్లే: కానీ, రెండవది, అలవికానిదిగా తోచింది. నవాబ్‌రాయ్ దీనికి లొంగిపోవటానికి సిద్ధంగా లేడు. అందువల్ల నవాబ్‌రాయ్ కలం పేరు మార్చుకొని, ప్రేమ్‌చంద్ అన్న పేరుతో పూర్వంకన్నా సూటిగా, ఘాటుగా వ్రాయటం కొనసాగించారు. సాధువుగా కనిపించే ఆ మనిషి అంతరంగంలో అపూర్వశక్తి దాగివుంది. బ్రిటిష్ అధికారపు హాహాకారాలకు లొంగిపోవటానికి బదులు ఇంకా విజృంభించారు. అంతకుముందే ఉరికంబం ఎక్కిన పద్నాలుగు సంవత్సరాల యువవీరుడు ఖుదీరాంబోసు చిత్రాన్ని ఇంటికితెచ్చి గోడలమీద ఘనంగా ప్రదర్శించారు।

1905-21, సంవత్సరాల మధ్యకాలం భారతదేశ చరిత్రలోనూ, ప్రపంచ చరిత్రలోనూ క్లిష్టపరిస్థితి ఏర్పడ్డ కాలం. ప్రపంచమే ప్రభావితమైన కాలం కూడా.

తిలక్ నాయకత్వం వహించిన సమయం అది.

1905 సంవత్సరం బెంగాలులో స్వదేశీ ఉద్యమం ప్రారంభమైన కాలం.

విప్లవవాదుల సంఘాలు, రహస్య బాంబులు, తుపాకులు కూర్చుకోవటం.

1909 సం॥ మింటో మార్లె సంస్కరణలు.

(1914-18) మొదటి ప్రపంచ యుద్ధం.

1917 సం॥ రష్యా విప్లవం.

గాంధీ దక్షిణాఫ్రికా నుంచి 1918 సం॥ భారత దేశం తిరిగి వచ్చారు. బ్రిటిషు వారి యుద్ధ ప్రయత్నంలో సహకరించాలని సైన్యాన్ని సమకూర్చటానికిగాను ప్రయత్నిస్తున్నారు. బ్రిటిష్‌వారు రంగులు మార్చుతూనే వున్నారు. ఓ ప్రక్క 1918 సం॥ మాంటిగా-చెంస్పర్డు ఓపాం, మరోప్రక్క 1919లో జలియన్‌వాలాబాగ్‌లో హత్యాకాండం.

ఆ తరువాత 1921 సం॥ గాంధీ నిరాకరణ ఉద్యమం.

ఈ విధమైన అనేక మార్పులతో కూడిన కాలమది. ప్రేమ్‌చంద్ ఆ సమయంలో ఉత్తర ప్రాంతంలోని చిన్న పట్టణాల్లో, పల్లెల్లో నివసిస్తూ వుండేవాడు. ఒక్కొక్కసారి రైలు రవాణాకు కూడా కొన్ని క్రోసుల దూరంలో వుండేవాడు. కానీ ఎప్పుడూ ప్రపంచం

వలసమూలల్లో జరిగే విషయాలు తెలుసుకోవాలనే తాపత్రయపడేవాడు. ఆ మారుమూలల ప్రాంతాలకు కూడా మంచి వార్తాపత్రికలు తెప్పించుకొని చదివేవారు. జాతీయ, అంతర్జాతీయ విషయాలపైన తన అభిప్రాయం వ్యక్తపరచగలిగాడంటే అందులో ఆశ్చర్యపడవలసిన పని లేదు. సోవియట్ సోషలిస్టు విప్లవంపట్ల సుముఖత చూపిన భారతీయులలో ప్రేమ్‌చంద్ ప్రధములు. ఆ సమయంలో అక్కడి వార్తలు గుప్తంగా వుంచబడ్డా, దాని ప్రస్తావన తన ఉర్దూ నవల గోషా-ఇ-అఫియత్ (హిందీలో ప్రేమాశ్రమం) అన్న దానిలో చేశారు. 21 డిసెంబరు 1919 సం॥ తన మిత్రుడికి వ్రాసిన లేఖలో ఈ భావం విపులంగా వుంది. అందులో మాన్‌టేగూ-చంమ్స్‌పోర్టు సంస్కరణను ఖండించారు.

"........ఈ సంస్కరణ చేసిన మంచి ఒక్కటే కనిపిస్తుంది. అది ఏమిటంటే, విద్యాధికులకు ఎక్కువ అవకాశాలంటూ కల్పించటం. దానిద్వారా సామాన్య ప్రజల గొంతు కోసే అవకాశం ఇంకా పెరిగింది. అంతవరకు ప్రజల రక్తం పీల్చే పెద్దలు, అధికారులై కూర్చున్నారు."

ప్రేమ్‌చంద్ కాలంతోపాటు ముందుకు సాగిపోయే వ్యక్తి....ఆ మాటకివస్తే కాలం కన్నా ఒకటి రెండడుగులు ముందే పయనించే మనిషి. ఆ సమయంలో ఆయన ఆరోగ్యం బొత్తిగా బాగుండలేదు; జీర్ణకోశానికి సంబంధించిన జబ్బు ఆయన్ని పీల్చిపిప్పిచేస్తుంది. అయినా ఆయన దానికి లొంగిపోలేదు. ఆయనలో చెలరేగే శక్తి అంతరించిపోలేదు. విశ్రాంతి అన్నది ఎరుగకుండా శ్రమించి పని చేశాడు. పాఠశాలలో విరామం లేదు. రాత్రి సమయంలో కూడా కూర్చుని వ్రాసేవారు. ఒక్కొక్కసారి భార్యకు తెలియకుండా అర్ధరాత్రి లేచి, చడీచప్పుడు లేకుండా లాంతరు వెలిగించుకొని, ఉదయం వరకు పనిచేసేవారు. ఆ తరువాత ఇంటి పని కొంత చేసుకోవలసి వుండేది. ఆ తరువాత పాఠశాలకు బయలుదేరాలి. దయ్యం పట్టినట్టు పనిచేసినా, పైకిమాత్రం స్థిమితంగా కనిపించేవారు. తన వ్రాతనుగురించి ఎన్నడూ ఆర్భాటం చేసేవారుకాదు. నిజంగా పనిచేసేవారికి సమయం అంటూ చాలకపోదు. అన్ని పనులు చేసుకోవటానికి ఆయనకి సమయం సరిపోయేది. ప్రతి ఉదయం రైతు నాగలి పట్టుకొని పొలానికి వెళ్ళినట్లే, ఆయన తన పనిని నిశ్చలంగా చేసుకుపోయేవారు. ఆ శక్తి ఆయనలో గుప్తంగా దాగివుండేది, కల్లాకపటం ఎరుగరు. ఎప్పుడో ఒక శుభ ముహూర్తంలోగాని రచనా సృష్టికి సమయం రావాలన్న వాదంలో నమ్మకం వుండేదికాదు. వారి రచనా శక్తి అంత నిశ్చలమైంది. ఎక్కడైనా, ఎప్పుడైనా కూర్చుని వ్రాయగలిగే



నలభై సంవత్సరాల వయసులో ప్రేమ్‌చంద్

విధంగా తన్ను తాను మలుచుకున్నారు. తన మనస్సును తాను ఆదేశించగలరు. దానికి దాసులు కారు. ప్రజలపట్ల, స్వాతంత్ర్యం పట్ల అతడికున్న అనన్య ప్రేమే ఈ శక్తి సామర్థ్యాలను వారికి ప్రసాదించి వుండవచ్చును.

దేశ స్వాతంత్ర్యం కొరకు పాటుబడే సైనికునిలా ప్రేమ్‌చంద్ తన కలంబలంతో నిలిచాడా అనిపించకపోదు. ఎన్నో అవరోధాలను ఎదుర్కోవలసి వచ్చినా యీ సమయం లోనే ఆయన లెక్కలేనన్ని కథానికలు, చిన్నా పెద్దా కలిపి, ఆరు నవలలు, టాల్‌స్టాయ్ కథల అనువాదం, ఆనాటి సమస్యల పైన మరింకెన్నో వ్యాసాలు వ్రాసారు. స్వాతంత్ర్య భావాలు ప్రజల మనసుల్లో నాటుకునేలా రచనలు చేశారు. బంకిం చంద్రుని ఆనందమాత్ వంటి నవల వరదాన్. అందులోని కథానాయకుడు దేశాభిమానం గలవాడు. వ్యభిచారం వంటి దురాచారాన్ని గురించి వ్రాసిన నవల సేవాసదన్. భూమి దున్నకుండా భూస్వామి అనిపించుకుంటూ, దున్నినవాని రక్తాన్ని జలగలా పీల్చివేసే అక్రమ విధానాన్ని విమర్శిం చిన నవల ప్రేమాశ్రమం. ఈనాటి పాఠకునికి ఆయన చూపిన పరిష్కార మార్గం, ఆచరణలో పెట్టలేని విధానంగా గోచరించవచ్చు. కానీ, మనం గ్రహించతగ్గ విషయం ఒకటుంది. ఆ కాలంలో అనగా అర్ధశతాబ్ద కాలం పూర్వం విరివిగా వెలువడుతున్న ప్రేమ ప్రధానమైన కథలుకాక, వాస్తవిక కషయాలను తన నవలలలో, కథలలో ప్రతిబింబింపజేసి హిందీ, ఉర్దూ ఉభయ భాషలలోనూ సమర్థవంతంగా వ్రాయగలిగారు ఆయన.

# 5

గాంధీజీ దేశమంతటా పర్యటించి, రానున్న పోరాటంలో పాల్గొనటానికి దేశ ప్రజలను సంసిద్ధం చేస్తున్నారు. ఫిబ్రవరి 8వ తా. 1921 సం॥ గోరక్‌పూర్‌లో గాంధీజీ పిలుపు అందరికీ అందినట్లే ప్రేమ్‌చంద్‌కూ అందింది. నిజానికి ప్రేమ్‌చంద్‌కి అప్పటికే ఉద్యోగం మీద విరక్తి కలిగింది. ఉద్యోగం ఒదిలి, కేవలం జాతీయ ఉద్యమం కొరకు పాటుపడాలని అనుకున్నారు. బ్రిటిష్ వారితో సంబంధం తెంచుకోవాలనిపుందని, ఉద్యోగం ఒదిలి పెట్టాలని వుందని, అందువల్ల తనకి ఏదైనా ప్రభుత్వంతో సంబంధం లేని ఉద్యోగం చూసిపెట్టవలసిందని స్నేహితులకు వ్రాస్తున్నారు. ఈ విరక్తి బ్రిటిష్ ప్రభుత్వ చర్యల పైన బాగా మళ్ళింది. బ్రిటిష్ ఉద్యోగులతో ఆయన దిగిన ఒకటి రెండు పేచీలు ఆ ప్రాంతాలవారు కథలుగా చెప్పుకునేవారు.

ఒక ఆవు విషయంలో జిల్లా మెజిస్ట్రేటుతో తగాదా పడ్డారు. ప్రేమ్‌చంద్ ఆవు మేజిస్ట్రేటు ఆవరణలో ప్రవేశించింది. మేజిస్ట్రేటు మండిపడి, ఆవును కాల్చి పారేస్తా నన్నాడు. ఈ వార్త వినగానే, ప్రేమ్‌చంద్ పరుగెత్తుకుంటూ వెళ్ళారు. మొట్టమొదట ప్రేమ్‌చంద్ నెమ్మదిగానే మాట్లాడారు, బహుశా కొంత వినయంగా కూడా మాట్లాడారేమో: మేజిస్ట్రేటు ఆగ్రహం అదుపులో లేదు. దానితో ప్రేమ్‌చంద్‌కి కూడా కోపం ముంచు కొచ్చింది. 'గుండెలుంటే ఆవును కాల్చి చూద్దాము' అనేశారు.

రెండవ తగాదా, విద్యాశాఖలో వున్న ఒక పెద్ద ఉద్యోగితో. అతడు తరుచుగా ప్రేమ్‌చంద్ ఇంటి ముందుగా వెళుతూ వుండేవాడు. ప్రతిసారి ప్రేమ్‌చంద్ అతనికి వినయ పూర్వకంగా సలాము చేయాలని కోరుకునేవాడు.

"అలాంటి వినయం నాచేత కాదు. పైగా పాఠశాల విడిచిన తరువాత నేను ఎవరికీ తల ఒగ్గవలసిన పని లేదే!" అని, ప్రేమ్‌చంద్ ఆ మాటపైన నిలబడ్డారు.

ఇటువంటి సంఘటనలతో ఆయనకి విసుగు పుట్టుకొచ్చింది. వీటన్నిటినుండీ బయటపడాలనుకున్నారు. కానీ అది అంత సులభమైన పనికాదు. ఇదివరకటికన్నా ఆరోగ్యం క్షీణిస్తోంది. మశూచివచ్చి ఒక కొడుకు మరణించటంవల్ల, మానసికంగా కూడా దెబ్బతిని వున్నారు. అదీకాక, మరో ఆధారం కూడా ఆయనకి దొరకలేదు. భావి జీవితం శూన్యంగా వుంది. భార్య ఇద్దరు పిల్లలుగల సంసారం. ఆదాయం లేకుండా గడపటం సాధ్యమైన పని కాదు. ఇరవై ఒక్క సంవత్సరాలపాటు చేసిన ప్రభుత్వోద్యోగానికి, దానితోపాటు లభించ నున్న పింఛనుకు నీళ్ళు ఒదలటం మాటలతో పనికాదు. ఒక వారం తటపటాయించవలసి వచ్చింది. గుండె నిబ్బరంగల అతని భార్య, ఆ సమయంలో అండగా నిలిచింది. బహుశా ఒక నిర్ణయానికి రావటంలో సాయపడింది కూడానేమో।

పరిస్థితి తిరిగి మొదటకే వచ్చింది. బ్రతుకుతెరువు కోసరం వెతుక్కోవలసి వచ్చింది. ప్రేమ్‌చంద్ కొద్దికాలంపాటు ఖద్దరుషాపు ఒకటి పెట్టారు. త్వరలోనే అది తనకు అచ్చిరాలేదని తేలిపోయింది. ఒక పత్రికాధిపతిగా పని చెయ్యాలని ప్రయత్నించారు. అది కూడా కలిసిరాలేదు. అందువల్ల గోరక్‌పూర్ నుంచి బనారసు వెళ్ళాలని నిశ్చయించు కున్నారు. అక్కడ మర్యాద అనే హిందీ పత్రికాధిపతిగా కొన్ని నెలలపాటు పనిచేసి, తరువాత కాశీ విద్యాపీఠం, విద్యా విభాగంలో అధ్యాపకుడుగా కుదిరారు. అదికూడా ఎక్కువ కాలంపాటు కొనసాగలేదు. ఆ తరువాత కాన్పూరు మార్‌వాడీ స్కూలులో కొద్ది కాలం పని చేసారు.

1923 సం॥ ప్రేమ్‌చంద్ తన పల్లెలో స్థిరపడి, దగ్గరలో ముద్రణాలయం, ప్రచురణాలయం ప్రారంభించాలనుకున్నారు.

1916 సం॥ గణేష్ శంకర్ విద్యార్థిని కలుసుకున్నప్పటి నుంచీ, ఈ అభిప్రాయం ఆయనలో నాటుకొని పోయింది. హిందూ, మహమ్మదీయ ఐక్యత కొరకు ప్రాణాలొడ్డిన వీరుడని తప్ప, ఈ మహ వీయుని గురించి మరేమీ తెలియకపోవటం శోచనీయం. నిజానికి అతడు చేసిన ఎన్నో పనులలో అది ఒకటి. ప్రధమంగా స్వాతంత్ర్య పిపాసతో పాటుబడి ముందుకు వచ్చినవారిలో అతడు ఒకడు. అపూర్వమైన ధైర్యసాహసాలు, నీతినిజాయితీ



ప్రేమ్‌చంద్—1924

గల వ్యక్తి. అతణ్ణి కలుసుకొని తెలుసుకొన్న వారంతా అతడి పరిచయ భాగ్యంతో ఉత్తేజ పూరితులైనవారే. కాన్పూరులో ప్రతాప్ ప్రెస్ స్థాపించి, దాని ద్వారా స్వాతంత్ర్య సాధన కొరకు సంఘాభ్యుదయం కొరకు పాటుపడినవాడు. ప్రేమ్‌చంద్, అటువంటి వ్యక్తిని

అనుకరించాలనుకోవటంలో ఆశ్చర్యం లేదు. కానీ, ఇటువంటి కార్యం విజయవంతంగా కొనసాగాలంటే, వ్యాపార పద్ధతుల్లో మెలకువ, ఆర్థిక స్తోమత ఈ రెండూ అవసరం అన్న విషయం ప్రేమ్‌చంద్ గుర్తించి వుండరు. ఈ రెండూ ప్రేమ్‌చంద్‌వద్ద లేవు. అందువల్ల యీ ప్రచురణాలయం, ముద్రణాలయం, ప్రేమ్‌చంద్ మెడకు చుట్టుకొని జీవితాంతం ఒదలలేదు. ఉద్యోగం కొరకు అన్వేషించటం తప్పనిసరి అయింది. ఈసారి లక్నోలో మాధురి పత్రికాధిపతిగా చేరారు. కానీ, ఆ పత్రిక నిర్వాహకులు ఆయన క్షేమాత్రం సహకారం అందించలేదు. పాఠ్యపుస్తకాలు తయారుచేసే పని వంటి ఆఫీసు పనులు చాలా ఆయనపైన పెట్టారు. అక్కడి పని దంపుడు పాటగా తయారైంది...."పందెపు గుర్రం, జట్కా గుర్రంగా మారింది" అని ఒకరు ఛలోక్తి విసిరారు కూడాను.

రాను రాను ఆ పని భారంగా తయారవటంవల్ల ప్రేమ్‌చంద్ ఆ పని కూడా ఒదులుకోవాలని నిశ్చయించుకున్నారు. ఈలోగా కాశీలో తన ప్రచురణాలయం నుంచి హన్స్ అనే పత్రిక నొకదాన్ని ప్రారంభించారు. తాను కన్న కలలు పండించుకోవాలని 1932 సం॥ మే నెలలో కాశీకి ప్రయాణమయ్యారు.

ఈ ప్రయత్నం కూడా పూర్వపు అనుభవాలు వలెనే అనిపించినా, ప్రేమ్‌చంద్ లెక్కచెయ్యలేదు. అది ఆయనకి మామూలైపోయింది. చాలా సంవత్సరాల తరువాత జాతీయ ఉద్యమం ఒక అలలా వచ్చిపడింది. కర్తవ్యదీక్ష ముందు ఆయన దేనినీ లెక్కచెయ్యలేదు. హన్స్ ఒక తలనొప్పి పనిగా తయారయినా, దానికి సరిపడ్డ పెట్టుబడి తనవద్ద లేకున్నా, ప్రేమ్‌చంద్, జగన్ అనే వారపత్రికను ప్రచురించాలని తలపెట్టారు. తన సొంతవిషయాల్లో ఎంత పొదుపరో, దేశ సౌభాగ్యానికి సంబంధించిన విషయాల్లో అంత తెగింపుగల వ్యక్తి. ఈ తెగింపుకు కారణం, ఆ కార్యదీక్షకు సంపూర్ణంగా అంకితం కావటమే. బహుశా ఏ ఘనకార్యమయినా సాధించాలంటే, అది ఒక్కటే మార్గమేమో. వెనకాముందూ ఆలోచించి చేసే పని విజయవంతంగా కొనసాగవచ్చు కానీ, విశాలహృదయాని కది చిహ్నం కాదు.

ముద్రణాలయం మూలకంగా ఎన్నో సమస్యలు తల ఎత్తినవి. ఒక్కొక్కసారి అందులో పనిచేసే వారికి వేతనాలు చెల్లించలేక, మరొకమారు కాగితానికి ఆయన ఖర్చు

పెట్టలేక....మొత్తంమీద అది ఒక శోచనీయమైన గాథగా తయారయింది. కానీ ప్రేమ్‌చంద్ ఈ ఒడుదుడుకులను పాటించలేదు. ఆయనలో ఉత్సాహం ఉబికి వస్తూనేవుంది. వారిలోని అనంతమైన సృజనాశక్తికి అది చిహ్నం. నిత్య జీవితం ఎన్ని కష్టనష్టాలతో కూడివున్నా, ఆయన రచన మాత్రం నిర్విఘ్నంగా కొనసాగుతూనే వుంది. లక్నోలో ఆయన ఎన్ని పనుల ఒత్తిడిలోవున్నా చిన్న కథానికలు కాక, ప్రతిజ్ఞ, నిర్మల అన్న రెండు చిన్న నవలలు, గబ్బన్ అనే పెద్ద నవల వ్రాయగలిగారు. లక్నో రాబోయే ముందు కాశీలో ముద్రణాలయం పెట్టి, డబ్బు ఇబ్బందులతో ఎలాగో దాన్ని నడుపుతూ, అనేక ఆర్థిక ఇబ్బందులు ఎదుర్కొంటూ, అనేక కథానికలు, ఇతర రచనలుకాక, రంగభూమి, కాయ కల్ప అన్న రెండు పెద్ద నవలలు, సంగ్రామ్, కర్‌బాలా అనే నాటికలు వ్రాయగలిగిన సమర్థవంతులు. ఆయన తిరిగి కాశీ చేరుకున్న తరువాత 1931-32 సంవత్సరాలలో, జాతీయ ఉద్యమాన్ని ఆధారంగా తీసుకొని "కర్మభూమి" అన్న నవలా రచనలో నిమగ్న మయ్యారు. వేయి కళ్ళతో కనిపెట్టుకొని వుండే పహరావానిలా జాతీయ రంగంలో ఏది జరిగినా, దానిని క్షుణ్ణంగా అవగాహనం చేసుకొని తన రచనల్లో వ్యక్తపరచగలిగేవారు. అందులోనే ప్రేమ్‌చంద్ శక్తిసామర్థ్యాలు ఇమిడి వున్నాయి. ప్రఖ్యాత పత్రికాధిపతిగా, అనేక సంవత్సరాలబాటు పార్లమెంటు సభ్యుడుగా ఎన్నికయిన బనారసీదాస్ చతుర్వేదికి యీ సమయంలో ప్రేమ్‌చంద్ వ్రాసిన లేఖవల్ల ఆయన స్వభావం తేటతెల్లమవుతుంది:

"నాకు జీవితంలో ఆశ అంటూ ఏదీ లేదు. ప్రస్తుతం మన స్వాతంత్ర్య పోరాటం విజయవంతం కావాలన్న ఆకాంక్ష మాత్రం వుంది. ఎన్నడూ ఐశ్వర్యవంతుణ్ణి కావాలని గాని, పేరు ప్రతిష్టలు పొందాలనిగాని తృష్ణ నాకు లేదు. అత్యవసరాలకు సరిపడ్డ ఆదాయం వస్తూంది. కారు, సొంత భవనంలాంటి భోగాలపైన నాకు మమకారం లేదు. నాకు కొన్ని ఆదర్శాలుగల గ్రంథాలు వ్రాయాలని వున్న మాట నిజమే. కానీ దాని ధ్యేయం కూడా-స్వరాజ్య సాధనలో విజయం సాధించాలన్న గమ్యమే. నా కుమారు లిద్దరి గురించి కూడా గొప్ప ఆశలు లేవు నాకు. నేను కోరేదంతా వారు నీతినిజాయితీగా, సంకల్ప బలంతో జీవితం సాగించాలనే. వారు ఐశ్వర్యంలో ఓలలాడటం, ఐశ్వర్యం కొరకు ప్రాకులాడటం,

with this problem & have only such members as believed in a common language. It shall have brought out a language in a common language in different scripts. It would have been a real service. At present its activities are communal and it has failed to justify its existence.

Certainly Hindustani is not a literary language in form and significance & grandeur. Literary language is supposed to be something apart from the spoken language. I believe in our literary expression coming as near as possible to spoken speech. At least in drama, story & novel we can write in popular language, including biography and travel, and these branches comprise three fourths of literature & that which really matters. Your science & philosophy may be written in Sanskrit or Prakrit. I don't care. As Garson de Tassy says 'to-day Hindi & its ancient moorings is the vain effort to turn the river's flow to its source.'

About the books I have asked my son to give you an account with whom he deposited the books. You may not be aware, my both children are at Kayastha Pathshala Intermediate School and lodging in the same building as Hindustani Academy. But they are shy extremely which they seem to have inherited from me supposing I am their father. His name is Sripat Rai. If you can send for him and ask an explanation he will tell you what became of the books.

Lekhak Sangh. Its only fruitful activity is in my opinion cooperative publication, so that every author contributing to its membership may be assured a royalty of 30 to 40%. The Hindi market is so dull and authors are so anxious to get their books published that they will come to any compromise with the publishers. If they stick to their terms & publisher refuses to publish their books, the poor fellow will be nowhere. The analogy is that

అధికారులకు దాసోహం అనటం నేను సహించలేను. నాకు విశ్రాంతిగా జీవితం గడపటం కూడా ఇష్టం లేదు. సాహిత్యం కొరకు. దేశసౌభాగ్యం కొరకు పాటుపడాలని నా ఆకాంక్ష. ఇంక నా అవుసరాలంటే-మామూలు అన్నం. కూర. దానికితోడు కొంచం నెయ్యి. సామాన్యమైన బట్టలు వుంటే చాలు."

మూడు సంవత్సరాల తరువాత బనారసీదాస్‌కి వ్రాసిన మరొక ఉత్తరంలో, జపాన్ నుంచి కలకత్తా విచ్చేసిన జపాన్ కవి యోనినొగూచిని కలుసుకోవటానికి తాను రాలేనని వ్రాస్తూ తన అంతరంగంలోని కొన్ని భావాలు యిలా వ్యక్తపరిచారు:

"ఈ ప్రపంచంలో మహోన్నతమైన భావాలుగల మహనీయులెందరో వున్నారు. కానీ అందులో ఎవరు నిజంగా గొప్పవారో, ఎవరు బూటకంమనుష్యులో తెలుసుకోవటానికి నిశితమైన విచక్షణా శక్తి కావాలి. గొప్ప వ్యక్తి అనతగ్గవాడు. అష్టయిశ్వర్యాలలో తులతూగటం అన్నది నేను వూహించుకోలేను. విజ్ఞానాన్ని గురించి. వివిధ కళలను గురించి ఆడంబరమైన మాటలు ఎన్ని చెప్పినా నేను నమ్మను. పేదలను కొల్లగొట్టి ఐశ్వర్యం పోగుచేసుకునే తెగకు చెందిన వారంటే నాకు గౌరవం లేదు. నా జీవితంలో ఓటమి. ఒక విధంగా యీ విధమైన మనస్తత్వానికి దారితీసి వుండవచ్చును. బ్యాంకులో ధనం కట్టలుగా మూల్గుతుంటే బహుశా నేనుకూడా ఆ ఐశ్వర్యవంతుల్లా డబ్బువ్యామోహంలో పడివుండే వాడినేమో. చెప్పలేను....కానీ. ఏ అదృశ్య హస్తమో నన్ను యీ పేదవారి తెగలో చేర్చింది. అందుకు నేను సంతోషిస్తున్నాను. నాకిదే ఆత్మశాంతి నిస్తుంది."

ఈ ఆత్మశాంతి అన్నది ఆయనకి పుష్కలంగా లభించింది. ఆయన కలంనుంచి వెలువడుతున్న అనేక కథానికలుకాక, "కర్మభూమి", (గోదాన్) వంటి రచనలు కొనసాగుతూనే వున్నాయి. ఇవికాక, ఆయన ప్రచురిస్తున్న రెండు పత్రికల ద్వారా, నిరంతరం బ్రిటిష్ ప్రభుత్వాన్ని దుయ్యబడుతూనే వున్నారు. ఇది ఆయనకి అల్ప సంతోషమేమీ కాదు: పరమానందకరమైన విషయం.

ఆర్థిక విషయాల దారే వేరు. వాటికి ఒక వ్యక్తి ఆత్మశాంతితోగాని, ఆతని



ఆయన కట్టించిన ఇల్లు

బాగోగులతోగాని సంబంధం వుండదు. వాటి లోక్యం డబ్బు మొత్తంతో మాత్రమే. రెండు పత్రికలూ, ఆయన తాహతుకు మించినంత అప్పుల్లో పడ్డాయి. అదే సమయంలో, బొంబాయి అజంతా సినిటోన్‌కి చెందిన మోహన్ భవాని వద్దనుంచి ఆహ్వానం వచ్చింది. ప్రేమ్‌చంద్‌కి సినిమా ప్రపంచంలో అడుగు పెట్టాలన్న కోరిక లేదు. కానీ తానున్న పరిస్థితుల్లో మరో గత్యంతరం లేదు. అప్పుల వాళ్ళ ఒత్తిడి చేస్తున్నారు. డబ్బు పుట్టి తీరాలి. అందువల్ల ఇష్టం లేకున్నా ఒక్క సంవత్సర కాలం భవానీతో ఒప్పందం కుదిరారు. ప్రేమ్‌చంద్ వూహించినట్లుగానే, ఆయన ఆ ప్రపంచంలో ఇమడలేకపోయారు. నవలాకారుడు జైనేంద్ర కుమార్‌కు యిలా వ్రాశారు:

"....ఇక్కడకు నేను ఏ ఉద్దేశంతో వచ్చానో, ఆ ఉద్దేశం మాత్రం నెరవేరలేదు. సినిమా ప్రొడ్యూసర్లు వారికి అలవాటయిన సినిమా కథలు తప్ప, ఏ మాత్రం మార్పులు చెయ్యటానికి సుముఖంగా లేరు. వారికి అసభ్యత అన్నది ప్రదర్శనా యోగ్యంగా తోస్తుంది."

హైదరాబాదులో వున్న గోరీకి ఆయనిలా వ్రాశారు:

"....సినీరంగంలో భవిష్యత్తు నిర్ణయించే పెద్దలు, దురదృష్టవశాత్తు, దాన్ని ఒక వ్యాపార దృష్టితో చూస్తున్నారు. వ్యాపారానికి అభిరుచులెందుకు, సక్రమ మార్గాలెందుకు? వ్యాపార సరళికి కావలసిందంతా దోపిడి మాత్రమే. ఇక్కడ మనం అనుకునే పవిత్రమైన అభిప్రాయాలన్నీ మార్పుచెంది, దోపిడీ అవుతుంటాయి."

ప్రేమ్‌చంద్‌కు ఆ జీవితం విసుగుపుట్టి, సంవత్సరం తిరగకుండానే ప్రయాణం కట్టాలని ప్రయత్నించారు. భవానీ ఆయన్ని మరో సంవత్సరమైనా వుండవలసిందని బలవంత పెట్టినా, ప్రేమ్‌చంద్ వినిపించుకోలేదు. ఆయన మనసంతా సొంత వూరు వెళ్ళిపోవాలన్న ఆలోచనతో నిండిపోయింది. ఆ సమయంలోనే ఇంగ్లండునుంచి తిరిగివచ్చిన హిమాన్సురాయ్, ఎలాగయినా ప్రేమ్‌చంద్‌ని ఒప్పించి బొంబాయిలోనే వుంచాలని ప్రయత్నించాడు. దానికి ప్రేమ్‌చంద్ మర్యాదపూర్వకంగా మాట్లాడినా, వీలుకాదని

ఖచ్చితంగానే చెప్పేశారు. తాను (ఈ రంగుల ప్రపంచం నుంచి) ఎలాగయినా త్వరలో బయటపడి ఊరు చేరుకోవాలి. అదీ ఆయన నిశ్చయం. జైనేంద్రకు ఈవిధంగా వ్రాశారు:

"నేను గోదాన్ నవల ఇంకా ముగించవలసి వుంది. ఇక్కడ వ్రాయటం, నా తరం కావటం లేదు. బొంబాయికి స్వస్తిచెప్పి నా ఇల్లు చేరుకోవాలి. అక్కడ డబ్బు వుండకపోవచ్చును, కానీ ఆత్మతృప్తి అయినా వుంటుంది. ఇక్కడ, నా జీవితాన్ని వృధా పుచ్చుతున్నానేమో అనిపిస్తూంది."

ఏప్రెల్ 4, 1935 సం॥ ఆ విధంగా బొంబాయి ఒదిలి వెళ్ళారు ప్రేమ్‌చంద్.

# 6

పది నెలలపాటు బొంబాయిలో వుండే సరికి ఆయన ఆరోగ్యం బాగా దెబ్బతిన్నది. కాశీ చేరుకునే సరికి కాలేయం జబ్బు బయట పడింది. అయినా ఆయనకి విశ్రాంతి మాత్రం లేదు. ఆయన రచనలన్నింటిలో ప్రపంచ ప్రఖ్యాతి గాంచనున్న రచనా శిఖామణి గోదాన్ గురించి ఆలోచనలో ఆయన నిమగ్నులయ్యారు. (సాంఘిక, సాంస్కృతిక అంతర్జాతీయ సంస్థ, ఆసియా సాహిత్య ప్రచురణలలో ఈ పుస్తకం 'The gift of the Cow' ది గిఫ్టు ఆఫ్ ది కౌ అన్న పేరుతో ఆంగ్లంలో ప్రచురించింది.) నీతి, నిజాయితీ, దైవచింతనగల ఒక సామాన్య పేద రైతు కష్టగాధలు, అతడి మరణం ఆ కథలో చిత్రించబడ్డాయి. పల్లెపట్టున ధనికులు, పేదవారిని ఎన్ని విధాలుగా పీల్చి పిప్పి చేసేదీ, యీ కథావిధానంలో వర్ణించ బడింది. గ్రామ జీవితంలో దౌర్జన్యదారులపైన ఎత్తిన దండయాత్ర ఇది. ఎన్నో అవరోధాలను ఎదుర్కొంటూ, చివరకు 1936 సం॥ ప్రేమ్‌చంద్ ఆ పుస్తకాన్ని ముగించారు. ఆయనది వూరకవుండే స్వభావం కాదు. ''మంగళ సూత్రం'' అన్న మరో నవల ప్రారంభించారు. దారిద్ర్యంతో బాధపడుతున్న ప్రఖ్యాత రచయిత దానిలోని కథానాయకుడు. ఆత్మకథలోని అంశాలు ఛాయలుగా అందులో తొంగిచూస్తున్నాయి. అది ముగించే ముందే ఆయన గతించకపోతే, ఆ నవల ఏ విధంగా మలుచుకుని వుండేదో!

1935 సంవత్సరం ప్రాంతంలో కొందరు భారతీయ యువకులు ఇంగ్లండులో, భారతీయ అభ్యుదయ రచయితల సంఘం ప్రారంభించారు. ముల్కురాజ్ ఆనంద్, సజాద్ జహీర్ అందులోని సభ్యులు. వారు తమ అఖిల భారత గోష్టి, ఏప్రెల్ 1936 సం॥ లక్నోలో జరుపదలుచుకున్నారు. ప్రేమ్‌చంద్‌ని అధ్యక్ష పీఠం అలంకరించవలసిందిగా కోరారు. ఆ సంస్థ ఆశయాలు బాగా ఎరిగివున్న ప్రేమ్‌చంద్ తన అంగీకారాన్ని వెంటనే తెలియచేశారు. అంతకు ముందే ఆ సంస్థ ప్రారంభమయిన వార్త ఇంగ్లండునుంచి రాగానే ప్రేమ్‌చంద్ తన పత్రికలో దానికి స్వాగత వచనం పలికారు. ఉత్తేజపూరితమైన ఆయన ఉపన్యాసం ఆ సమావేశానికి పునాది రాయిగా భాసించింది. ప్రజల సాంఘిక, నైతిక

విలువలకు ప్రాధాన్యమిచ్చిన ప్రేమ్‌చంద్, అదే ఆదర్శాలు కొనసాగించటానికి కంకణం కట్టుకొని నిలిచిన యీ సంస్థ కృషిపట్ల ఆహ్లాదం వ్యక్తపరచటం సహజమే.

ఆయన మనస్సులో మెదిలే మరొక ముఖ్య విషయం, భాషకు సంబంధించినది. హిందీ, ఉర్దూ భాషలు ఒక దానిపైన ఒకటి పోటీపడి నిలిచి, ఒకదాని నొకటి బహిష్కరించాలనుకోవటం రెండిటికీ గొడ్డలిపెట్టని ఆయన గ్రహించారు. ఆ ఉభయ భాషలలోనూ రచయితగా ప్రఖ్యాతి గాంచిన ప్రేమ్‌చంద్, ఆ రెంటి మధ్యా వంతెనగా నిలిచి, రెండిటి మధ్యా సామరస్యాన్ని నెలకొల్పాలని ప్రయత్నించారు. ఈ ఆశయం ఆయన మనస్సును బాగా ఆకరించింది. చివర కాలంలో జీవితాశయంగా కూడా మారింది. ఈ ఆశయం కొనసాగించాలని దేశమంతటా పర్యటించారు. లక్నోనుంచి లాహోరు, అక్కడనుంచి నాగపూరు. అక్కడ గాంధీజీ అధ్యక్షత క్రింద హిందుస్థానీ భాషా విషయంలో సమావేశం జరగనుంది. తాను కన్నకలలు నిజరూపం దాల్చలేవని కొద్దికాలంలోనే తేటతెల్లమైంది. ఆయన కేవలం ఎండమావుల కోసం పరుగులు తీస్తారు. ఉభయ భాషలలో, ఛాందసులు ఆయన సుందర స్వప్నాన్ని కూల్చివేశారు. ఇది ప్రేమ్‌చంద్‌కి దుఃఖకారణమైంది.



ఆయన వస్తువులు



ఆయన పెట్టె, కళ్ళద్దాలు

ఇంకొక రకమైన ఎదురు దెబ్బ కూడా ప్రేమ్‌చంద్ ఆదర్శమార్గంలో కాచుకొని కూర్చుంది. తాను నమ్మిన మరొక ఆదర్శానికి కూడా ఆయన తిలోదకాలు ఒదలవలసి వచ్చింది. ద్విశతాబ్దాలపాటు ఈ ఆదర్శానికి అంటిపెట్టుకొని వున్నా, చివరకు ప్రయోజనం లేదని తెలుసుకోగలిగారు. ధనికవర్గాన్ని మనసు మార్చుకొని, ఐశ్వర్యం ధారపొయ్యమనటం, చిరుతపులిని చుక్కలు ఒదులుకొమ్మనటం లాంటిదని తెలుసుకున్నారు. తప్పనిసరిగా ఒప్పుకోవలసి వచ్చిన ఈ సత్యాన్ని ఒప్పుకుని తీరటమన్నది ఎంత బాధాకరమైన విషయమో, అసంపూర్ణంగా మిగిలిన నవల 'మంగళ సూత్రం'లో వ్యక్తమవుతుంది.

"నిజమే, దేవతలు లేకేం వుండేవారు, వుంటారు కూడాను. వారి దృష్టిలో ప్రపంచం మతాలపైన, నీతిశాస్త్రాల పైన ఆధారపడి వుంటుంది. వాటి కోసం వారు ప్రాణాలు కూడా ధారపోయటానికి సిద్ధపడతారు. కానీ వారినెందుకు అసలు దేవతలనాలి?

వారి తత్వంలో వారు మునిగి తేలుతూ వుంటారు. వారిని పిరికివారనాలి. న్యాయం కొరకు సదుం బిగించి నిలిచి, దాని కొరకు ప్రాణాలొడ్డిన వారే దేవతలు. తెలిసిన విషయాన్ని కూడా తెలియనట్లుగా నటించినట్లయితే, అతడు మానవత్వం లేనివాడు. కానీ తనచుట్టూ వున్న దుష్టవిధానాలు తనకు పట్టనట్టు ప్రవర్తిస్తే. అతడు గ్రుడ్డివాడు, తెలివి తక్కువ వాడు కూడాను, దేవత మాత్రం కాదు. నిజానికి దేవతల కిక్కడ స్థానంలేదు. దైవమనీ, దైవపూజలనీ, విధి అని, అవినీతికరమైన వాటిని వ్యాపింపజేసినది ఈ దేవతలే. వారి మూలంగానే ఇంకా ఈ విధానాలు కొనసాగుతున్నాయి. లేకపోతే మానవుడు రూపుమాసి వుండును. ఈ విధంగా నడిచేకన్నా, రూపుమాసి పోయివుంటేనే బాగుండిపోను. మానవుల మధ్య మనం మానవులుగానే మెలగాలి. మ్రింగివేయాలని కాచుకుని వున్న మృగాల మధ్య మెలకువగా వుండక తప్పదు. అవి మనను చీల్చి చెండాడనిస్తే అది చేతగానితనం-దైవత్వం మాత్రం కాదు.''

1936 సం॥ ప్రేమ్‌చంద్ హిందూస్థాని దండయాత్ర నుంచి చాలా అలసటచెంది తిరిగి వచ్చారు. అయినా అతడికి విశ్రాంతి అంటూ లేదు. పూర్వంలాగానే తరచుగా అర్ధ రాత్రి లేచి కూర్చుని అలివిగాని శక్తి ఏదో ఆవరించినట్లుగా వ్రాసేవారు. తన జీవనయాత్ర ముగిసేలోపుగా తన శ్రమజీవన అనుభవసారాన్ని బహిర్గతం చేయాలన్న అంతరంగంలోని ఆరాటమేమో అది. నవలా రచనకాక, అనేక గొప్ప కథానికలలో కూడా ప్రత్యేక స్థానం అందుకున్న 'కఫన్' అన్న కథానిక వ్రాశారు. ధనిక వర్గాన్ని దుయ్యబడుతూ, నవ సమాజాన్ని నెలకొల్పాలన్న తాపత్రయంతో 'మహాజని సభ్యత' అన్న విమర్శనాత్మకమైన వ్యాసం కూడా ఈ సమయంలో వ్రాసినదే. అసంపూర్ణమైన నవల, యీ రెండు రచనలు, ఆయన ప్రేమించిన ప్రజలకు చివరి కానుకలుగా మిగిలాయి.

శుష్కించి పోయిన ఆ శరీరానికి శక్తిలేక పోయింది. 25 జూన్ 1936 సం॥ ఎంతో రక్తం కక్కారు. దాన్ని కడుపులో రణం (గాస్టిక్ అల్సర్) అన్నారు. ఎందరో వైద్యులు పరీక్షించినా, ఎన్నో విధాలైన మందులు వాడినా ప్రయోజనం కనిపించలేదు. రోజు రోజుకీ ఆరోగ్యం క్షీణించింది. ఆ తరువాత కాలేయం జబ్బు అన్నారు. వైద్యులు చెప్పిన ఆ పేర్లు ఆయనకి అర్థం కాలేదుగాని, బాధ మాత్రం బాగా అర్థమైంది. అవసాన కాలం ఆసన్నమైందని ఆయనకి తెలుసు. కానీ అది వారిని బెంబేలుపెట్ట లేదు. మనసు శాంతంగానే వుంది: అందువల్ల అతడికి భగవంతునితోగాని, భగవంతుని

దూతలతోగాని పనిలేక పోయింది. జీవితంలో ప్రతిక్షణం అర్థపూరితంగా, సృజనాత్మకంగా జీవించారు. అంతకన్నా కోరుకోదగ్గదేముంది గనుక? వీడ్కోలు తీసుకోవలసిన కాలం ఆసన్నమైంది. ఆయన్ని ఎడబాయటమన్నది సన్నిహితులందరికీ హృదయవిదారకమైనదే. కానీ ఆయన జీవచ్ఛవంగా మిగిలారు. పాలిపోయి లోతుకుపోయిన చెక్కిళ్ళతో అస్థిపంజరంలావున్నా, భరించలేని బాధకు గురి అవుతున్నా, ప్రశాంతంగా వికసించిన వదనంతో కనిపించటంవల్ల అక్టోబరు 8, 1936 సం॥ ఆయన కన్ను మూసినప్పుడు అందరూ దిగ్భ్రమ చెందారు. బంధువులు, సన్నిహిత స్నేహితులు పది పన్నెండుమంది మాత్రం అంత్య క్రియలు జరిపారు. ఆదివలెనే, నిరాడంబరమైన అంతం.



ఆయన రచించిన 'ఈద్‌గాహ్' నుంచి ఒక చిత్రం

# ఈ శ్రేణిలోని పుస్తకములు

| | |
|---|---|
| బాపు (మహాత్మాగాంధీ జీవిత చరిత్ర సచిత్రముగా రెండు భాగాలు) | రచన, చిత్రములు : ఎఫ్. సి. ఫ్రెయిటాస్ |
| కాశ్మీరు | ఛాయా చిత్రములు : పి. ఎన్. శర్మ<br>మాలాసింగ్ |
| పక్షుల లోకం | జమాల్ ఆరా |
| మన నదుల కథ - మొదటిభాగం | లీలా మజుందార్ |
| హిమాలయ శిఖరాలు | బ్రిగడియర్ గ్యాన్ సింగ్ |
| సరస, వినోద కథలు | మనోజ్ దాస్ |
| స్వర్గయాత్ర - ఇతర కథలు | లీలావతి భాగవత్ |
| ఒక నాటకం వేద్దాము | ఉమా ఆనంద్ |
| మన రైల్వేల కథ | జగ్‌జీత్‌సింగ్ |
| స్వాతంత్ర్య గాథ - మొదటి భాగం | విష్ణు ప్రభాకర్ |
| అనగా అనగా - మొదటి భాగం | ఎం. చోక్సి & పి. ఎం. జోషి |
| యుగయుగాల కథలు | శాంతా రంగాచారి |
| బడాపానీ | లీలా మజుందార్ |
| వీరుల కథలు | రాజేంద్ర అవస్థి |
| పువ్వు, తుమ్మెద | అశోక్ దావర్ |
| హాకీ | శారదిందు సాన్యాల్ |
| తపాలా బిళ్లల కథ | ఎస్. పి. చటర్జీ |

వెల : రూ. **2** - 50 ప్రతి

**ఈ పుస్తకములు భారతదేశంలోని అన్ని భాషలలో లభించును.**